శ్రీ రామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

# హరిశతకము

శ్రీ రి

గుండవరపు వీరభద్రయ్యగారిచే

రచియింపబడి

గుండవరపు వెంకట్రాయుడుచే

ప్రకటింపబడియె.

బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

500 ప్రతులు.

1923

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీ హరి శతకము.

ఇది

గుండవరపు వీరభద్రయ్యగారిచే

రచియింపబడి

గుండవరపు వెంకట్రాయుడుచే

ప్రకటింపబడియె.

బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

500 ప్రతులు.

1923

# విజ్ఞప్తి.

ఆర్యులారా,

నేను మా కరణీకగ్రామంబగు గుండవరగ్రామంబున నివసించియుండి వ్యవహరించుచుండ నాలుగునంవత్సరముల క్రిందట కర్మవశంబున నాశరీరమునం దొక కురుపులేచి అమితంబగు బాధనొందుచు తన్నివారణంబునకై సాక్షాత్ శ్రీమన్నారాయణమూర్తి యనందగు శ్రీరామచంద్రప్రభువును నామనంబున ధ్యానంబుచేసిన బాధ తొలంగునని నాయంతరంగంబున దోచ యేలక్షణగ్రంధంబు లెరుంగకయే రామాయనెడు మకుటంబుగా కందపద్యములలో నొక్కశతకంబు వ్రాయ నుత్సహించి వ్రాసియుంటిని. వ్రాయునంతలో నాకు సంభవించిన బాధయంతయు తగ్గిపోయెను. ఆ శ్రీరామమూర్తియె తొలగద్రోచెనని నామనస్సునకు సంపూర్ణమైన నమ్మకముండి సదా ధ్యానించుచుంటిని. ఇట్లుండ యీ దుందుభినామసంవత్సర వైశాఖమాసంబున నొకరోజున శ్రీహరిశతకంబును వృత్తంబులలో రచియింప నూహ జనియింప రచియించియుంటిని. గాన భక్తితప్ప లేశమైన కవిత్వతత్వ మెరుంగని యీ దాసుం డొనర్చిన శతకంబులలో తప్పులున్న నొప్పులుగా భావించి మన్నించుదురని నా విజ్ఞాపనము.

ది 15—1—1928.
గుండవరము.

ఇట్లు: బుధజన విధేయుడు,
గుండవరపు వీరభద్రయ్య.

శ్రీరస్తు.

## సీసమాలిక.

గుంటూరునకు దాపు । గుండవరంబున
　　　　గ్రామకర్ణమంచు । ఘనత కెక్కి
అవని ప్రసిద్ధమౌ । యార్వేలవారిలో
　　　　కౌండిన్యసద్గోత్ర । ఘనయశుండు
ధర గుండవరపు శ్రీ । ధన్యుండనగ నొప్పు
　　　　వేంకటరాయుండు । విదితయశుఁడు
తండ్రియై యలరారు । తల్లి యాదెమ యన
　　　　పరమపతివ్రత । భాగ్యశాలి
అన్నపూర్ణకు నుద్ది । యనఁనొప్పి వేళకు
　　　　నతిధుల కవ్వారి । నన్న మిడెడు
సోదరు లిద్దరు । సొబగు దీపింపంగ
　　　　సుబ్బయాఖ్యుండన । సుజనహితుఁడు
రెండవసోదరుం । డండయా కృష్ణుండు
　　　　దివికేగ పురజనుల్ । దిగులుజెంద
మూఁడవవాఁడనై । ముదముతో శ్రీవీర
　　　　భద్రనామంబున । బరగినాడ
శ్రీరామశతకంబు । శ్రీరాముకృపగల్గ
　　　　భక్తితో వ్రాసితి । ముక్తి గోరకు

భూరి చల్లావల్లి । పుల్లయాఖ్యసహాయు

మమర శ్రీహరిశక్తి । మల్లినాడ

యచ్చునొత్తించుట । కార్యహేతుండైన

నాయన్న కృష్ణుని । నందనుండు

వేంకటరాయుండు । వేడ్కచే సమ్మతి

నడిమెను నాకోర్కె । పరిఢవిల్ల

సంస్కృతాంధ్రములందు । సంస్తుతికెక్కిన

కవిరాజబిరుదంబు । గనినయట్టి

శ్రీకామ్మరాడ్వంశ । శేఖరుండైనట్టి

లక్ష్మీకాంతం బను । లలితయశుఁడు

తే॥ నాదు మిత్రుండు తప్పుల । నాదుమొదుట

నొప్పులుగ జేసి యొసగెను । యోర్పుగలిగి

యట్టి స్నేహితుఁడిలలోన । యనువుమీర

చిరతరంబుగ శుభములు । జెందుగాత॥

# పండితాభిప్రాయములు.

గుంటూరుతాలూకా మొనమదల గ్రామకాపురస్థుడు గొల్లపూడి నరసింహారావు యిచ్చిన అభిప్రాయము:—

ఉ॥ భావము రూపమున్ మధుర । భావముతో నొనగూర్చి [ముద్దుకున్
తావగు నూత్నశైలి ఫలి । తార్థపదంబులగూర్చి పెట్టి ను
ద్భవిభవైకమోహనకర । నీరుహనాభుని కంకితంబుగా
నీవు రచించినట్టి కమ । నీయ కవిత్వము వర్ణనీయమా॥

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీ హ రి శ త క ము.

ఉ॥ శ్రీరమణీ మనోహరుని చిత్తమునన్ దలపోసి శంకరున్
కూరిమి మీరగాదలచి కోరికతో హృదయంబునందు నా
వారక సృష్టికర్తయగు । వారిజసంభవుగొల్చి భక్తిచే
భూరిసుఖంబు నాకిడగ । మువ్వురకాంతలనంతు శ్రీహరీ॥

ఉ॥ మోక్షముజెందగోరి మును । ముందుగ నీకథ నాదువాక్కునన్
యక్షయమంచు పల్కెదను । యంచితభక్తి విరక్తి రీతినే
లక్షణగ్రంథముల్ యెరుగ । లాలితమైన పదంబులిచ్చి న
న్నీక్షణజేసి బ్రోవుమిక । నేటికి ప్రొద్దులుపుచ్చ శ్రీహరీ॥ 2

ఉ॥ రామకథాసుధారసము । రంజిలగ్రోలిన భక్తపాళికిన్
తామసవృత్తి శూన్యులగు । ధన్యులకెల్లను జ్ఞానమూర్తులై
నీమహిమార్థ సంపదల । నేలి సుఖించిన యోగపాళికిన్
మామకవందనంబులు స । మర్పణజేసి నుతింతు శ్రీహరీ॥ 3

ఉ॥ రామకథా సుధామృతము । రంజిలగ్రోలగ వేచియున్న నన్
పామరుడంచు నెంచుటలు । పాడియె నీకది యోగ్యమౌనె నా
తామసమున్ నివారించి పర । తత్త్వము దెల్పగలేవె సర్వదా
తామరసాక్ష నీచరణ । దాసుని బ్రోవగరాదె శ్రీహరీ॥ 4

ఉ॥ ఆపదలెల్ల బాపుకరు । ణాంబుధి చంద్రుడవైన నిన్ను నే
నాపదబాంధవాలకను । నార్య హితంబగు త్రోవనమ్మితిన్
తాపసవర్యులం దయతో । తప్పక బ్రోచినయట్లు యీమహా
పాపుని దుష్టవర్తనుని । పంతముసేయక నేలు శ్రీహరీ॥ 5

పంకజనాభ నిన్ను మది । బాయక దివ్యపదార్థరాశిచే
వంకర లేక గొల్తునిక । వారిజలోచన! కృష్ణ! మాధవా
మంకుతనంబువీడి యల । మందరపర్వతమెత్తి భక్తులన్
పొంకముమీర బ్రోచి నటు। పొందుగ నేలగరాదె శ్రీహరీ॥6

ఉ॥ దారుణపాతకాబ్ధిబడి । ధైర్యముచే నిను గొల్వ కెప్పుడున్
వారక దుష్టబుద్ధినయి । వంతలనొందుచు రోగబాధలన్
జేరగ సిద్ధమైతినని చెప్పి । నినున్ మది వేడుకుందు నో
సారసపత్రనేత్ర మురసంహార నన్ను క్షమించు శ్రీహరీ॥ 7

ఉ॥ మానవజన్మమెత్తి భువి । మానక నిన్ను దలంచుకొంటె నో
దీనజనావనా! విమల । తేజ! సుపూజిత! భక్తపోషణా!
మానవనాథ దైత్యకుల । మారణ వేరొకవృత్తి లేదు నా
మేనున ప్రాణముల్ గలుగ । మేలనియెంచి నుతింతు శ్రీహరీ॥

ఉ॥ పంకజనాభ! యిప్పటికి। పాపములన్నియు కుప్పలయ్యె నా
వంకనుజూచి మత్తుడని । వంచనసేయక వేరునెంచకో
శంకరమిత్ర నీమహిమ । చాలగ నెన్నుచు నుంటి నీకిక
కింకరునంటి దాసుపయి । కిన్కనుమానుమటంటి శ్రీహరీ॥9

చ॥ హరి! పరమాత్మ! కేశవ! య। హర్నిశమున్ నిను గొల్చుచుండగా
పరమదయాస్వభావమున । భక్తునిపాపము ద్రుంపరాదె నీ
చరణయుగంబు నెప్పుడును । చయ్యన నాకు ప్రసన్నమానటుల్
నరవర! సేయుమయ్య యిక । నమ్మితి తప్పదు నీకు శ్రీహరీ॥10

ఉ॥ తారలు లెక్క సేయనగు । తావక నామము లెన్న గాదగున్
మీరిన యుక్తి చేతనులు । మిక్కుటమైనను సేయుగానగున్
భారములైన ద్రవ్యముల । పంతముతో దుల తూంద గానగున్
సారము లేని యీ దురిత । సంఘము నీదగ లేను శ్రీహరీ॥11

శా॥ రమ్మా రాఘవ! రామచంద్ర! సుమనో । రామా! మహీజాధిపా!
యిమ్మా నాకభయంబు వేడితి నినున్ । యింకేల నీదీను చే
కొమ్మా, జాలము సేయబోకు కరుణన్ । కోర్కెల్ దగన్ దీర్ప రా
నిమ్మా! సత్కృపగల్గ మ్రొక్కులిడుదున్ । నీప్రాపుకో శ్రీహరీ॥

శా॥ దారిద్ర్యంబును దాటలేక ధరలో । దాస్యాది దుర్వృత్తులన్
క్రూరత్వంబున జేసి పొట్టకొరకై । గోల్పొంటిన్ ధర్మమున్
రారమ్మంచును చేరదీసి భువిలో । రక్షించు వారెవ్వరున్
లేరీ దాసుని కష్టమెల్ల యుడుపన్ । లేవే హరీ! శ్రీహరీ॥ 13

ఉ॥ తామసమేల నాపయిని । దాసుని తప్పులు దిద్దలేక నన్
కాముకుడంచు నిట్టికడ । గష్టము నుంచితి వైన గాని నన్
నీమముతోడ బ్రోవగల । నెయ్యము నీవని యెంచి నమ్మితిన్
తామరసాక్ష! భూరమణ! । తద్దయు సౌఖ్యము లిమ్ము శ్రీహరీ॥

ఉ॥ రమ్మని నిన్ను వేడినను । రావది నా దురదృష్టమేమొ నీ
నమ్మకమెల్ల తేటబడె । నమ్మిన వారిని నమ్మినట్లు చే
కొమ్ము దయామతిన్ పరుల । కోరను నామది నెల్ల వేళలన్
నమ్మితి నమ్మితిన్ నిజ మ । నాథుల నాథుఁడవీవు శ్రీహరీ॥15

ఉ॥ సంగరరంగమందు నిను । సాహసవిక్రముఁడైన రావణుం
డంగబలంబుతో నెదుర । నందరఁగూల్చియు నమ్మినట్టి వే
దాంగవిదున్ విభీషణు న । మంచితప్రేమను నాదరించియు
ప్పొంగగ లంకలోన ముది । పొంగుచు నుంచితివౌర శ్రీహరీ

చ॥ రవికులరామచంద్ర! రఘు । రామ! దయాంబుధిసోమ! సద్గుణ
త్ప్రవిమలతేజ! కార్ముకధ । రా! భువి పేదరికంపు బాధ నే
నవియఁగ లేనుగాన దయ । నల్ల కుచేలుని రీతిఁ బ్రోవగా
దవిలి భజింతు నిన్నపుడు । ధర్మపథంబుననుండి శ్రీహరీ॥17

ఉ॥ సన్నుతిఁ జేతునయ్య నర । సార్థపదంబుల నీదుకీర్తి యో
పన్నగశాయి! యోవరమ । పావననామ! వికుంఠధామ! నా
విన్నపమాలకింపు మవి । వేకుఁడ దీనుఁడ నీదు దాసుఁడన్
మన్ననతోడ బ్రోవుమిక । మాధవ! నమ్మితి నిన్ను శ్రీహరీ॥18

ఉ॥ పంతము దేల జేసెదవు । భక్తులఁ గాచి వరంబు లిచ్చి ని
శ్చింతలనుంచి దుష్టులను । శిక్షయొనర్పగ జాలినట్టి ని
కెంత మహానుభావ నను । నీగతి నుంచుట మేలె నీకు? కా
సంతయనుగ్రహింపుముని । సన్నుతనామ సుశీల! శ్రీహరీ॥19

ఉ॥ దారి నెఱుంగలేక పెడ । దారిని నమ్మి వృథాభిమానినై
మీరినపాపపుంజముల । మిక్కుటమైతలముంచుదాక నే
వారక చేసినాడ నిక । వార్ధికమున్ పులి మ్రింగనుండె నీ
తారకమంత్రమున్ దలఁతు । ధన్యుఁడనౌటకుగాను శ్రీహరీ॥

ఉ॥ లోకములెల్లఁ బ్రోతువని । లోకులు నిన్ను దలంతు రెప్పుడున్
శ్రీకరమూర్తి! యోసుగుణ । శేఖర! దానజనానుకూల! న

స్నేకరణే కృపామతిని । నేలెదా? నేలుము నేలకున్న నీ
ప్రాకటమైన సద్యశము । పాటిదొలంగగ జేతు శ్రీహరీ॥

ఉ॥ కాలము దాపురించు తరి । కర్మపిశాచము పట్టువేళలన్
మేలుగ యెంతునో నిను । నిమేషమునైనను నెంచజాలనో
జాలము సేయ కెప్పుడును । సన్మతి నీ చరితంబు నెంతు జే
జేలకుమిన్న! యేగతిని । సిద్ధుని జేతువొ నన్ను శ్రీహరీ॥

చ॥ భిదురము చేతబూని । యతిభీకరులైన మురాసురాద్యులన్
కదనమునన్ జయించి నిజ । గర్వపరాక్రమమందు పెద్దయై
యెదురుగ నిల్వలేక నిను । నింద్రుడు ప్రార్థనచేసి వేడగా
మదిముదమంది రక్కసుల । మర్దనజేసితివార శ్రీహరీ॥23

ఉ॥ రామమరుండవై జగము । రాణవహింపగ నేలునట్టి నిన్
డీమనియెంతు నామదిని । డీలుపడన్ పరువేడబోను నే
నామనియుంటిగాన నిక । నాకలిదీర్పుము దేవదేవ! నీ
శ్రీమరరారు పాద సర । సీరుహముల్ దగగొల్తు శ్రీహరీ

ఉ॥ మంజులమైన నీకథల । మానక యెప్పుడు సంస్మరించుచున్
నంజలిలేక పూజనలు । నిశ్చలభక్తితో జేయుచుండి నిన్
రంజిలజేసి నీకృపను । రమ్యముగా గనుగొందమన్న యా
కంజభవాది దేవతలె । కానగజాలరు గాదె శ్రీహరీ॥ 25

ఉ॥ శ్రీమహనీయ తేజ! నిను । చిత్కమలంబున కట్టియుంపగా
భ్రామికజెంది యెచ్చటకి । బారెదు? నన్విడిపోవన్యాయమే
ప్రేమనుజూచి కావదగు । పెద్దలు లేరిక నాకు సద్గుణ
స్తోమ పరాకు సేయక సు। శోభితరూపము జూపు శ్రీహరీ॥

ఉ॥ రాఁగదవయ్య రామ! రఘు। రామ! పరాత్పర! యోదయాంబుధే
వేగమె పేదవాఁడిదు వి। వేక పదార్థము లాఁగగింపగా
భోగిశయాన! మాటలతొ। ప్రొద్దులు పుచ్చఁగ నేల! యోమహా
భాగ! దయాలవాల! భవ। బంధవిమోచన! రమ్ము శ్రీహరీ॥

ఉ। మన్నిలయంబు లేమిపర। మందిరమందున నుంటికష్టముల్
యున్నియటంచు దెల్పుటకు। యించుక నాతరమా నెమాధవా
క్రన్ననవాకు నేదొయొక। కట్టినయిల్లు ననుగ్రహింపుమో
పన్నగశాయి! యోదనుజ। భంజన! యోమురవైరి శ్రీహరీ।

ఉ। భూవలయంబునందు గల। పుణ్యజనాళినిధర్మపద్ధతిన్
కావఁగ నెంచి నీచులగు। కల్మషచిత్తుల క్రూరకర్ములన్
భూవర! ద్రుంప సాధులకు। పుట్టెడినీకివె వందనంబులో
భావజుగన్నతండ్రి నను। భావమునందున నుంచు శ్రీహరీ॥

ఉ। యోగులునీదురూపమును। యోగముచేదగ జూడనెంచిరిన్
బాగుగ లక్ష్యరూపమున। బట్టినవారల మానసంబులో
దూగుచు నోలలాడుచును। తుమ్మెదరీతి వసింప లేదెయో
భోగిశయాన నామదిని। పొంకముగా వసియింపు శ్రీహరీ॥

ఉ॥ భూతహితార్థమై కరుణ। బూనియనేకములైన జన్మలన్
ఖ్యాతిగ నెత్తియెత్తి మది। కామితముల్ గనగోరువారి వి
ఖ్యాతమతిన్ నొసంగితివి। కారుణికోత్తమ నిన్నునెంచగా
నాతరమా త్రిలోకహిత! । నారదసన్నుత! గావు శ్రీహరీ॥

శా। యోగాభ్యాసము చేయజాలననుచున్। యోచించి యె [ల్లప్పుడున్
భోగీభోగశయాన నీస్మరణనే। పొల్పొందగా జేయుచున్

నిన్ గోరన్ దమకింక నేల నికనీ। నెమ్మిన్ దగన్ జూపుచున్
వాగీశాదుల నెల్ల నేలు కరణిన్। పాలింపుమో శ్రీహరీ॥

ఉ॥ నమ్మితి నామనంబునను। నాదగు కోర్కెల దీర్తువంచు నీ
విమ్మహిలోన దాసులకు। నింపుదలిర్పగ జేసినట్టిమేల్
రమ్మని నన్ను వారివలె। రక్షణసేయ దలంప వేల? చే
కొమ్ము దయామతిన్ నిను న। కుంఠితభక్తిని నెంతు శ్రీ॥

ఉ॥ మానక యెల్ల వేళలను। మంజులమైన భవత్కథామృతా
పానము సేయు నెంచి బహు। భంగులనిన్ను నుతించి వేడగా
రానియరాదె నీకరుణ। రామ! సుధాంబుధిసోమ! నాదెసన్
ధ్యానము సేయువాడనిక। దాసుని బ్రోవగ దయ్య శ్రీహరీ॥

మ॥ మితిలేనట్టి దురంత సమ్మిళితమై। మిన్నంటు పాపంబుచే
గతియే జాడ నెరుంగమిన్ దిగులుచే। జ్ఞానంబు లేకేను నిన్
సతతంబున్ గనజాలకుంటినికనీ। సంసారమగ్నాత్ము నే
వెతలన్ బెట్టక బ్రోవరాదె సుతుడన్। వేవేగ మే శ్రీహరీ॥

చ॥ అహమిక నున్న కాలమున। హర్షముకై నిను నెంచలేక దు
స్సహ దురితాంధకారమున। చాల స్వవృత్తులవీడితిర్గితిన్
యిహమున గల్గుసౌఖ్యముల। నెంతయునమ్మక మోసపోతినో
యహిధరమిత్ర! కోర్కెలిడు। నాత్మను నెంచుదు నిన్ను శ్రీ॥

ఉ॥ వేదములెల్ల దొంగిలియు। వేగమె నీరధి జొచ్చుసోమకున్
వేదనుమంగ మత్స్యమయి। పీరిడి రాక్షసు గూల్చి వేధకున్
వేదములిచ్చినట్టినిను వేయివిధంబుల గొల్చువాడ నన్
నీదయతోడ నేగతిని। నేలెదొ? కోర్కెలనిచ్చి శ్రీహరీ॥

ఉ॥ అందముతోడ దేవతలు / నల్ల నిశాచరు లమృతంబుకై
మందర పర్వతంబును స / మానబలంబున వార్ణవంబునన్
పొందుగ ద్రచ్చుచుండగను / పోడిమిదప్పియు కొండగ్రుంగగా
క్రిందకు జేరి కూర్మమయి / కీర్తిని నిల్పితి వీవె శ్రీహరీ॥ 38

చ॥ మదమున హేమనేత్రుడిల / నుత్తిలి సాధులగొట్టి లోకమున్
గుదురుగనుండనీక ధర / కోపబలంబున చాపచుట్టి న
ట్లొదవగ జేయు రక్కసుని / యూపిరి బాపగ ఘోణిరూపివై
ముదమునబుట్టి భక్తులకు / మోదము గూర్చితి వౌర శ్రీ॥

ఉ॥ బాలుని ధిక్కరించి వెస / బంటుతనంబున నిన్ను జంపుగా
బోలునటంచు నెంచి పని / బూనికుమారుని బాధసేయగా
వేళ యెరింగి కంబమున / భీకరవృత్తి నృసింహమూర్తివై
బాళిజనింప రాక్షసుని / ప్రాణముదీర్చితి వౌర శ్రీహరీ॥ 40

ఉ॥ వామనరూపమెత్తి భవ / బంధుడవై బలిమూడు పాదముల్
నీమముతోడ వేడికొని / నిర్జరులెల్ల శభాసనంగ వే
ధీ మహిమోన్నతంబుగను / దిక్కులనెల్లను నాక్రమించియా
భూమిని నేలు రక్కసుని / త్రొక్కగ ద్రొక్కితి వౌర శ్రీహరీ41

చ॥ బలిమిని క్షత్రవంశముల / పంతము మీరవధించి తండ్రికిన్
ఫలుమరు తర్పణంబు నర / పాలుర రక్తము చేత నిచ్చియున్
సలలిత ధర్మమార్గమున / సంయమిచంద్రుల నెల్లగాచి నీ
విలజరియించితౌర భళి / యెంచ పరాముడవయ్య శ్రీహరీ42

చ॥ దశరథుపట్టివై ప్రజల / తండ్రినిబోలగ నేలుచుండ నిన్
కుశికసుతాది మౌనిజన / కోవిదు లందరు భక్తితోడయా

పశుపతి వాసవాదులును । బ్రహ్మయులోనుగ దేవతాళినీ
యశముసుతించి మ్రొక్కులిడ। వారల బ్రోవగ లేదె శ్రీహరీ

ఉ॥ రోహిణికిన్ జనించి యల । రూపవతీ సతియైన రేవతిన్
మోహముమీర పెండ్లియయి ముచ్చటలూరగ ద్వారకాపురిన్
సాహస సంభ్రమంబులను। సానుజుడైనముకుందమూర్తితో
బాహుబలంబునన్ మగధు । బట్టియువీడితివయ్య శ్రీహరీ

చ॥ అగణితమైన పాపముల । నంటగనీయక సత్వమూర్తివై
సాగసనుమాట లేక మరి । సొమ్ములదాల్పక దారురూపతన్
జగములనెల్ల బ్రోవగను । సంపదలీయగ సన్నుతింపగా
నగునన జన్మమెత్తి ధర । యందున బుద్ధుడవైతి శ్రీహరీ45

చ॥ కలియుగమంత్యకాలమున। కల్క్యవతారముదాల్చిభూమిలో
బలియులనెల్ల ఖడ్గమున। బాహుపరాక్రమలీలద్రుంచియున్
సలలిత ధర్మమార్గముల । సాటగ ప్రాగ్యుగమందు నెల్లయా
కలియుగమందునల్లై వెస । గాచెదవంచు దలంతు శ్రీహరీ

ఉ॥ యాదవవంశమందుయుద। యంబయినందునిమందలోపలన్
మోదముమీర పెద్దవయి। ముద్దులుగుల్క యశోదముందటన్
పాదములందు గజ్జలను । పాపటబొట్టును నొప్పుచుండగా
నాచటనాడుచుండు నిను । నంజలిజేసి నుతింతు శ్రీహరీ

ఉ॥ పుట్టిన నాదిగా నెపుడు । పూజ్యులసేవ యొకింత సేయకే
మిట్టిపడంగదాని ఫల । మీగతి నన్నిట వ్యాధిరూపమై
బట్టివధింపుచుండె నిక । బాధల నే బడజాలనయ్య నా
పట్టుననీవు గట్టిదయ । ప్రౌఢతమీర వహింపు శ్రీహరీ48

ఉ॥ కామ మహాంధకారమున / కన్నులుగానక భోగవాంఛచే
తామసవృత్తితో నెపుడు / తామరసాక్షులగూడియుంటినో
తామరసాక్ష! నాదు దురి / తంబులనెల్లక్షమించిసత్కృపన్
కోమల దివ్యదేహ రిపు / కోటిదవానల! బ్రోవు శ్రీహరీ

ఉ॥ కోమల పాదపల్లవ చ / కోరక చంద్రికలెల్ల నామదిన్
యోమహనీయ తేజ! విమ / లోత్పలనేత్ర! కృపాసముద్ర! నన్
సీమహిమార్ధ సంపదల నేలగజాలెడి సౌఖ్యమిమ్మయో
సామజరక్షణా! మదిని / సన్నుతిజేతును నిన్ను శ్రీహరీ 50

ఉ॥ ధర్మజరాజసూయమున / దర్పమునీర్ష్యముబూని దామహో
కార్ముకమున్ ధరించినిజ / క్రౌర్యముగ్రక్కుచు నీచబుద్ధిచే
దుర్మదులీలవాగెడు / దుష్టునియాశిశుపాలు చక్రివై
ధర్మమునిల్పజంపితివి / ధారుణిభారముదీర్ప శ్రీహరీ॥ 51

ఉ॥ అర్జునుమీదిప్రేమమున / నల్లసుయోధను బంధుఘాతకున్
దుర్జనుదుష్టచిత్తు మరి / దోర్బలగర్వుని రాజ్యసంపదల్
కర్జములంచుగైకొనగ / గంధగజేంద్రసమాను భీముచే
భర్జనసేయజాలితివి / బంధుహితంబునుగోరి శ్రీహరీ॥ 52

ఉ॥ భానుకులప్రదీప! ముని / పాలన! ఘంతత సద్గుణోన్నతా!
దీనపరాయణా! విమల / తేజసుబోధక! సుప్రసన్న! నీ
మానసమందు నన్నెపుడు / మానకయుంచుము కీర్తిరీతి నే
తానలయాదిగీతముల / దన్పగజేతునునిన్ను శ్రీహరీ॥ 53

ఉ॥ నీమహనీయరూపమును / నీదుమహాత్మ్యమునీదుసత్కృపన్
నామదినిల్వజేయుమిక / నమ్మికతోభజియింతు నెప్పుడున్

తామరసాక్ష! యోవిమల। తాపసమానసపద్మహంస! మా
రామమనోహరా! కరుణ। రాదగునాపయినంటి శ్రీహరీ।54

ఉ॥ పరమాదయాకరుండునగు । భక్తునిసంతతసత్కృపావనా
కరువిగజేంద్రునికి కరుణ । గావగబూనినయట్టి నిన్ను నే
యరమరలేకగొల్చెదను । యంజలిజేసిమృదూక్తిపాళిచే
విరివిగసర్వసౌఖ్యముల । వేగమొసంగుమునాకు శ్రీహరీ।

ఉ॥ కన్నులజూడగోరితిని । కారుణికోత్తమ! నీదురూపు సం
పన్నచరిత్ర! మిత్రజన । పాలన! భక్తిరసానుకూల! నే
సన్నుతిజేసిగొల్చెదను । సర్వకళామయదివ్యతేజ! యో
పన్నగశాయి! యోముర। విభంజన! యోసురసేవ్య శ్రీహరీ।

ఉ॥ జన్మములెన్నియెత్తితిను । శత్రులనార్వురనోర్వలేక నే
జన్మలనెత్తుచుం జనుచు । చర్వితచర్వణమైతి వింక నే
జన్మలనెత్తకుండగను । జాలెదుమార్గము నాకుజూపవే
జన్మలలోననుండునర । జన్మకుసార్థకమెంచి శ్రీహరీ। 57

చ॥ అరమరలేకనీదు చర। ణాంబుజముల్ దగగొల్చుచుంటి సా
దరమునబ్రోచినన్ను నయ । తత్పరచిత్తునిజేయవయ్య యో
సురవరరాజపూజిత! వి । శుద్ధచరిత్ర! హితాళిమిత్ర! శ్రీ
కరసురరాజవందిత! న । కారుణికోత్తమ! వేగ శ్రీహరీ॥58

ఉ॥ అన్నమువస్త్రముల్ ధనము। నాగమశాస్త్రపురాణకావ్యసం
పన్నములియ్యకిట్లు ఋణ । బాధలబాల్పడ జేసితేల మా
యన్న! సహింపలేను నిను। నాత్మనునమ్మితిదిక్కటంచు నా
పన్నుఁడదీనమానసుఁడ। భక్తుఁడరిక్తుఁడ బ్రోవు శ్రీహరీ॥ 59

ఉ॥ అన్నలుదమ్ములున్ సుతులు / నాపులుబంధులు నాదిగా ధనం
బున్నను లత్త్యముంచిపలు / యూడిగముల్ పచరించుచుంద్రు తే
కున్న నుదొడ్డికూడిమచు / యూరక నిందలు సేయుచుందు రో
యన్న! వృథాధనంబునకు / నాశవహింతురు నమ్మ శ్రీహరీ॥

ఉ॥ ఏమియు తానుదాచుకొన / కెల్లధనంబును రాజ్యసంపదల్
స్వామివి నీవటంచు బలి / సర్వము నీకడ ధారబోసె నే
పామరుఁడన్ యిహంబునను / బండగ తావును నిల్వనీడనా
కేమియు లేదు నన్ను నిక / నేగతి నేలెదొ నీవు శ్రీహరీ॥61

శా॥ శ్రీకైవల్యమునివ్వజాలు నిను నే / సేవింతునిష్టార్థినై
యోకారుణ్యదయానిధే! మురరిపో! / యోకంససంహారకా!
పాకారిప్రముఖావనీ మునినుతా! / భక్తప్రియా! శ్రీధరా!
నాకోర్కెల్ దగదీర్పరాదె కరుణన్ / నారాయణా! శ్రీహరీ॥

శా॥ ఏరా! నీదయ కొంతనాపైనిరా / దేమద్ది నాకర్మమా
మారాకార సుధాకరార్కనయనా! / మాచిత్తసంచారకా
వీరాగ్రేసర! రామచంద్ర! రణదోః / శ్రీవర్యా! యికన్ నన్ను సం
సారాంభోధి తరింపజేసినిదుమో / సౌఖ్యంబులన్ శ్రీహరీ

ఉ॥ శ్రీధర! నాదిదేవ! నర / సింహా! యనంత! యమేయ! మాధవా!
భూధర! కామితప్రద! సు / పుణ్యచరిత్ర! వినీలగాత్ర! స
ద్బోధ! రమాకళత్ర! పరి / పూర్ణవినిర్మల కామకోటి తే
జోధర! కంబుకంధర! వి / శుద్ధగుణాకర! బ్రోవు శ్రీహరీ॥

ఉ॥ విద్దెలు నేర్చి పూజ్యులగు / విష్ణుకథామృత పానచిత్తులన్
ప్రొద్దున మేలుగాంచగను / పుణ్యులప్రాపుకు జేరి సేవలన్

గ్రద్దన చేయఁజాలుటకు । కర్మపిశాచము బట్టి త్రిప్పి నన్
రద్దులు రవ్వలేల? నిక । రక్షణజేయఁగదయ్య శ్రీహరీ॥65

ఉ॥ ఏమనివిన్నవింతు నిక । నేమనిదెల్పుదు నాదుకష్టముల్
కోమలదేహ! నిన్ను నెద । కోరితి నాదురితంబులన్నియున్
నీమది నుంచఁగా దగునె । నిక్కముగా భవదీయసేవకున్
సామజరక్షణాయ! సిరి । సంపదలియ్యఁగలేవె శ్రీహరీ॥

మ॥ అరయన్ మారుతపుత్రుపై శబరిపై । నాహల్యపై కేకపై
కరముప్పారఁగ రావణానుజునిపై । కంజాక్షియాసీతపై
వరసుగ్రీవునిపై సదాగుహునిపై । వాసిష్ఠమౌనీంద్రుపై
పరగంగల్గు భవత్కృపారసము నా । పైజూపుమో శ్రీహరీ॥

ఉ॥ వాదము లేల చాలునిక । వాదన జేసిన మేలుసున్న నీ
పాదయుగంబు నమ్మితిని । పంకజలోచన! భక్తపోషణా!
కాదన కీవు నన్ను నిట । కావుము నీరద! నీలదేహ! నా
మీదను కోపముంచకను । మించిన ప్రేమను నేలు శ్రీహరీ।

ఉ॥ మోదముమీర దాసులకు । ముక్తినిధానము నివ్వఁజాలు నీ
పాదములాశ్రయించి బహు । భంగుల నీచరితామృతంబు నే
సాదరబుద్ధి గ్రోలి యిహసౌఖ్యములందు దురాశవీడితిన్
కాదనకీవు నన్ను నిక । గావఁగశక్తుఁడవయ్య శ్రీహరీ॥ 69

ఉ॥ పుణ్యము సేయనైతినని । పొక్కుచునుండిన లాభమేమి లా
వణ్యచరిత్ర! సూరిజన । వందిత! శేషగిరీశ! దండకా
రణ్యనివాస! మానిజన । రక్షణ! నే ధనధాన్య శూన్యుఁడన్
పుణ్యపదంబు గల్గుగతి । పొందుఁగఁజూపఁగలేవె శ్రీహరీ॥70

ఉ॥ పాపము మూటగట్టితిని । పంకజనాభ దురాశకల్గి సం
తాపమునొందితిన్ దెలిసె । తత్ఫలమెల్లను చాలుచాలు నా
తాపముమాన్పి నిత్యమగు । తత్వరహస్యము దెల్పి వేగ నా
పాపములన్ హరించి హరి । భక్తుని సేయగదయ్య శ్రీహరీ

ఉ॥ నమ్మితి నిన్ను నామదిన । నాథుల బ్రోచు విధానమంచు నే
నమ్మ దురాశ గ్రస్తులను । నమ్మెద నీచరణాబ్జ దాసులన్
నమ్ముదు సత్యవాక్యముల । నమ్మకమే సుఖమిచ్చునంచు నీ
కమ్మని సత్కథల్ వినుచు । కాలము బుచ్చెదనోయి శ్రీహరీ

చ॥ హరిభజనంబు సేయుమని । యార్యులు చెప్పినగాని నామదిన్
జొరకను స్త్రీల జూచి మది । జొక్కుచు పాపభయంబు లేక నే
మురహర! సంచరించితిని । పుణ్యుని జేసి యుబ్రోవుమయ్య నీ
చరణములొత్తెదన్ యికను । జాలము సేయగ నేల శ్రీహరీ

మ॥ కరి ప్రహ్లాద విభీషణాదులు భవ । త్కారుణ్య సంప్రాప్తికై
ధర భద్రాచలమందు నుంటివనుచున్ । దర్శించి సద్భక్తిచే
విరులున్ భక్ష్యములాదిగా మధుర నై । వేద్యంబులర్పించుచు నీ
నరయన్ పద్యములిత్తునన్ గొనుమా । హర్షంబుతో శ్రీహరీ

ఉ॥ మాలిమి చేత నిన్ను బ్రతి । మాలు స్వతంత్రము గల్గి నీదుపై
తాలిమి బూనినాడ నిక । తప్పదు వైరము నీతో నాకు నన్
మేలుగ జూచి గాచెదవో । మెచ్చక జూడక బాధపెట్టెదో
చాలగ నొట్టు నీ నిజ య । శంబును నా యెడ నిల్పు శ్రీహరీ

చ॥ హరిహరి యెన్న దైవనిను । హస్తముచే తులసీదళంబుతో
మురియుచు పూజ సేయక యె ముక్తినొసంగు ప్రసంగ శూన్యునై

దురితములైన కర్మముల । దుష్టమతిన్ దగజేసినాడ నో
పరమకృపా సముద్ర! నను పాలనజేసి క్షమించు శ్రీహరీ

ఉ॥ దీనజనంబు పాలిటను । దిక్కుగ దైవము నీవెయంచునే
మానుగనమ్మి యెల్లపుడు । మానసమందు భజించుచుండగా
సానునయంబుగా గనవు । సౌఖ్యములివ్వగ చేతగాదె నీ
మౌనమువీడి బ్రోవుమిక । మాయలు సేయగనేల శ్రీహరీ

ఉ॥ భాగవతార్థమందు నిను । భక్తసమూహము భక్తిచేతియా
సాగరకన్యకారమణి । సత్ప్రియవర్తనచేత కుబ్జయున్
భోగవశంబు చేత సుఖ । మొందిరి; యెంతటి భాగ్యవంతులో
యోగమవేద్య! నన్నునటు । లాదరమొప్పగ బ్రోవు శ్రీహరీ

ఉ॥ గోపికలెల్ల నుక్కుయెడ । గొల్లలుగా జలకంబులాడగా
శ్రీపతివైననీవు వెస । చీరలుదొంగిలి పొన్నచెట్టుపై
దాపరికంబు సేయగను । దబ్బరలజ్జను వారువేడగా
ప్రాపుగ వస్త్రదానమును । వారికి జేసితివౌర శ్రీహరీ79

శా॥ కాళిందీమడుగందు శాపవశతన్ । కాళీయుడీర్ష్యాభుడై
నైశంబే నినుజుట్టిముట్టగను । నీవారందరున్ జూడ శ
స్త్రాళిం జంపక నాఫణాగ్రముల న్పై । త్యాగింపుగా వాడగా
బాళింనిన్ను నుతింప వానికిడవే ప్రాణంబులన్ శ్రీహరీ80

ఉ॥ తండ్రియుపేక్షసేయ పిన । తల్లియనాదరణంబుజూపిబల్
తీండ్రములైన వాక్యముల । తిట్టిన లో సయిరింపలేక యా
తండ్రిని తల్లినిన్ ధృవుడు । తత్క్షణమే విడి నీదుసేవలన్
వేండ్రముతోడ సల్పగను । వేగమె బ్రోవగలేదె శ్రీహరీ

మ॥ ధర నేకాదశి సద్వ్రతార్థ ఫలమున్ । ధర్మైకతాసక్తిచే
కరమొప్పన్ మది నంబరీషు డెలమిఁ । గాంక్షించి చే
యంగ యా
వర దుర్వాసునుకువచ్చి మత్సరముచే । వాదింప నీచక్రమున్
పరగంబంపియు మాని రాజులను వే । పాలించితో శ్రీహరీ

ఉ॥ మామక పాతకంబులను । మాన్పెదువంచు దలంచి నేనునీ
భీమ పరాక్రమంబునకు । భీతిల కెంతయు నమ్మియుంటినా
తామసమున్ హరించి భవ । తాపముదీర్పవె యోజనార్దనా
నీమముతోడ నిన్నపుడు । నిక్కముగా మది నాతు శ్రీ॥

ఉ॥ మారుతపుత్రు బ్రోచినటు । మన్ననతోడుతనన్ను బ్రోవుమీ
సారసుఖంబు చేకురగ । చక్కగనీపద సేవసేతు నో
రూరగ నీదుకీర్తనల । యోపికతో భజనంబు జేసెదన్
కారుణికోత్తమా! యికను । గావుము దాసుఁడనైతి శ్రీ॥

ఉ॥ అందరిలోన బ్రహ్మపరి । హాసముసేయఁగ నిన్ను గోపగో
బృందములెల్ల దాచినపు । డీవెమహాత్మ్యము జూపగోవులన్
సుందరులైన బిడ్డలును । సాక్కగనియ్యక వారిరీతిమున్
ముందుగనన్ని రూపముల । ముద్దుగనుంటివినీవె శ్రీహరీ॥

ఉ॥ గోపకులెల్ల జేయునల । గోపతియాగము పాడుజేయుగా
శ్రీపతివంచు శక్రుడట । చిత్తమునన్ గనలేక నిందు సం
తాపముతోడ మేఘముల । ధారుణిపీడ విచారమొందుయా
గోపకులంబు బ్రోచితివి । గోత్రము ఛత్రముజేసి శ్రీహరీ॥

శా॥ గోవిందాచ్యుత! పుండరీకనయనా । గోవర్ధనోద్ధారకా!
భావాతీత! కృపారసంబునడి వే • పాపౌఘ మగ్నాత్మునిన్

గావంగా దగునయ్య నీజగతి ని । క్కంబింక నిన్ జెరఁగా
త్రోవంజూపుముజూపకున్న నిను నే। దూషింతు నో శ్రీహరీ।

ఉ॥ చక్రము కేలబూని భువి। శౌర్యముగల్గిన దైత్యకోటి ని
ర్వక్రమలీలచెండి యవి । వేకము బాపినయట్టినీవు న
న్నక్రమ మేల జేసెదవు। యంబుజలోచన! యోమురారి!నా
వక్రములన్ని బాపుమిక । వంచన సేయగ నేల శ్రీహరీ॥ 88

చ॥ వదలక పూర్వకర్మముల । వారితదుఃఖము లిచ్చుచుండనా
పదలిట నన్ను బట్టుకొని । బాధల పిప్పిని జేయుచుండెనో
సదమల దివ్య తేజ! నిను । సన్నుతి జేతు భరింప లేను నన్
వదలక బ్రోవగాదగును । వందనమర్పణ జేతు శ్రీహరీ॥89

ఉ॥ దాసులనెల్ల బ్రోతువని । తద్దయు పెద్దలు చెప్పవింటి నీ
దాసుఁడనైతి నీచరణ । దాసులదాస్యము చేయుచుంటినా
దోసముమాన్పకున్న భువి। దూషణ సేయును సజ్జనాళి యో
భూనుత చిద్విలాస! నను। పుణ్యుని సేయగ లేవె శ్రీహరీ।

ఉ॥ సుందరరూప! శ్రీరమణ!। సూరిజనావన! భక్తపోషణా!
వందలు వేలు నీకుదగ । వందనముల్ మది జేతునయ్య గో
బృందము నేలినట్లు సుర । బృందము బ్రోచినరీతి గాచి నీ
యందము జూపగాదగదె । యత్రిజసన్నుత! నాకు శ్రీహరీ

చ। అతులితసజ్జనాళిచర । ణాబ్జములన్ గొలువంగ లేక నే
సతతము దుర్జనావళిని । చయ్యన జేరుక దుష్టబుద్ధినై
మితముకు మీరు దుర్నయము । మిక్కిలి జేసితి నన్ను గావు నీ
సుతహితబంధువర్గముల । సూటిగ నేలినరీతి శ్రీహరీ। 92

ఉ॥ సూర్యకులాబ్ధిశీతకర! సుందరరూప! దయాలవాల! నా
కార్యము లెల్లదీర్చకను గారియ బెట్టుట న్యాయమా నన దో
ర్వీర్యపరాక్రమంబునను వెంగలిమూకను గూల్చి దాసులన్
యార్యజనానుమోదముగ కాయుగ నేలితి వౌర శ్రీహరీ॥

ఉ॥ బాధలపెట్టకయ్య నిను పల్మరు వేడెదనో దయానిధీ!
మాధవా! శ్రీధరా! కపట మానువవిగ్రహా! కంబుకంధరా!
క్రోధము నేల బూనెదవు కోమలదేహా! ఖగేంద్రవాహా! నన్
యాధరఁ బ్రోవకున్న నిక యే నెటు బోవుదునయ్య శ్రీహరీ॥

ఉ॥ పద్మజుగన్న తండ్రివని భక్తులనందరి బ్రోతువంచు యా
పద్మభవాది దేవతలు భావమునం దలపోయుచుంద్రు నీ
సద్మములోన నుండకను సాధులగావగ లేచి వాదు హృ
త్పద్మములోన నిల్చియిక తక్షణమే నను గావు శ్రీహరీ॥

ఉ॥ కానలకేగి తమ్మునితో కష్టములన్ బడినావటంచు నిన్
మానవుఁడంచు నెంచుచును మానవులందరి వోలెనిన్ను నే
మానుగ నెంచుచుంటినుమి మాయకులోబడి దుష్టబుద్ధినై
దీనులపాలి సొమ్మనుచు దేవుఁడవంచు నెరుంగ శ్రీహరీ॥ ౧౩

శా॥ నీలావణ్యము నీదు మానసము నీ నేర్పెంచగా శక్యమే?
భూలోకంబుననుండు మానవులకున్ పొల్పొందగా దేవతల్
వాలాయంబుగ గానజాలరుగదా వాదంబులింకేల న
న్నేలాగైనను గావుమయ్య కరుణన్ నిదానుఁడ శ్రీహరీ॥

ఉ॥ శ్రీహరివాసరంబునను చిత్తములో వల శ్రీరమేశ! నిన్
మోహము మీర నెంచుచును ముచ్చటగా తగు పూజ జేతు నిన్

సాహసనంభ్రమంబునన్నునన్నుతిజేసెడిదాసబృందమున్
యాహరిగొల్చినట్లుమది । యంజలిజేసినుతింతుశ్రీహరీ। 98

ఉ। ఓపరమాత్మ! యోవరద! । యోహరి! కేశవయోసురార్చితా!
యోపరమేశ! యోసుగుణ! । యోమునిపూజిత! యోజనార్దనా
యోపురమర్దనాత్మసఖ! । యోపురుషోత్తమ! యోనృకేసరీ
యోపవనాత్మజావినుత! । యోకవివంద్య! నుతింతుశ్రీహరీ॥

ఉ॥ నీకరుణాకటాక్షమును । నీదగుప్రేమను నాదుపైని యో
శ్రీకరమూర్తి! యుంచు మిక । చిన్నతనంబును జేయబోకునీ
ప్రాకటమైన రూపమును । వంతముమీరగ జూడగోరితిన్
నాకొకమారు దర్శనము । నమ్మగసియ్యగదయ్య శ్రీహరీ॥

చ। పలుమరు వేడినన్ వినక । బాధలు పెట్టెద వేల నాపయిన్
నలుకలుబూననేల నిక । నంబుజలోచన ! పార్థసారధీ !
తులువతనంబు జేసితని । దుర్మదుఁడంచని నెంచబోకునీ
సలలితపాదపద్మముల । చక్కగబట్టెదనిమ్ముశ్రీహరీ॥101

ఉ। తెప్పులువ్రాసినానొమరి । తప్పకయొప్పులువ్రాసియుంటినో
యొప్పిదమైన నీమదికి । యోదనుజాంతక నాదుశక్యమున్
గొప్పగ శాశ్వతంబుగను । కోరిజనుల్ పఠియించునట్లుగా
యొప్పులకుప్ప జేయుమిక । యుంచెదనిన్ మదిలోనశ్రీహరీ॥

సంపూర్ణము.